శ్రీ

# సత్యవాక్యము.

---

ఇది

హనుమత్సూర్యకవులచే

రచియింపఁబడినది.

పబ్లిషరు

కొత్తపల్లి సుందరరామయ్య.

1 వ కూర్పు 1000 ప్రతులు.

ఏలూరు

రామమోహనముద్రాక్షరశాల

1914

వెల 0-0-6 లు.

శ్రీ

# సత్యవాక్యము.



సత్యమనఁగా నెందఱకుఁ దెలిసినట్లియున్నదిగాని యేరీతిగాఁదెలిసినది యనుశంకకుసందు గలదు. సత్యమనఁగా నబద్ధమాడకుండుట అబద్ధమనఁగా—ఒక విషయము దానుజూచి దానినే తనవిరోధులకుహానికలుగులాగునమార్చిచెప్పుట యబద్ధమనవచ్చును. ఒకపుస్త

---

గొప్పకులమునఁ బుట్టినాఁడని గుణ

ఱుంగను, ఎవ్వరో దుర్మార్గులు దొం
గిలించి యుందురు" అని పల్కుటి
మా యిదియనబద్ధమే. ఇట్టివెన్ని
యోగలవు. సత్యమనినను నిజ మ
నినను వాక్యయథార్థముగ నేవాడుకొ
నుచున్నాము. నిజమనఁగా ఉన్నది
యున్నట్లు చెప్పుట కూడ నగును.
సత్యమనఁగా నెన్నిరీతులనైన ను
న్నది. ఇచ్చెదనని ఇవ్వకుండుట
నసత్యము క్రిందఁ జెప్ప వచ్చును.
అసత్యము=సత్యము కానిది. మన
వలెఁ గాకకొందఱు సత్యము తప్ప

గుణాగుణములకుఁ గులము.తోఁబని లేదు.

ముని వ్రతముపట్టి యుందురు. తన కొడుకు సంగతి యైనను భార్యావిషయమైనను ప్రాణము పోవునను కాలముకోఁగూడ వారు సత్యము తప్పి యబద్ధమాడరు. ఇట్టి వారలలోఁ బూర్వముహరిశ్చంద్రుఁడుండెను. మనము మనలో నెవ్వరికైన నప్పుపడిగాని యిచ్చెదనని చెప్పికాని ధనముగలనాఁడు మిన్ను మన్ను గానక తిరిగి పేదవారమై "యిప్పుడు నా చేతఁ దమ్మిడీ లేదు నే నెక్కడనుండి తెచ్చి యిచ్చెద"

---

ఉదా — పెద్ద టెంకవలనఁ బుట్టిన తాటి

నని చేతులు నలుపుదుము ఇదియు సత్యమేయగును. అనినమాటతప్పకుండుటసత్యమన్నమాటయే. హరిశ్చంద్రుఁడు రాజ్యము పోయినను కొడుకు చచ్చినను, భార్యనురాజభటులు శిక్షించుచున్నను విశ్వామిత్రునకుఁ దానుప్రభువై యున్నపు డిచ్చెద ననిన సొమ్మిచ్చుటకే ప్రయత్నించినాఁడు. కాఁబట్టియే సత్య హరిశ్చంద్రుఁడనివానినిబిలుతురు. ఇతఁడెట్టివాఁడో ఎన్నికష్టములు పడినాఁడో మీరు పుస్తకము

---

చెట్టుతననీడ నొకరికిని నిలిపియెండ వేళఁ

లలోఁజదివి నాటకములలోఁ జూ
చియున్నాఁగ. సత్యమును గుఱించి
మీరు తీరిక చేసికొని కాగితము
కలము చేతఁబట్టి దినదినమును మ
నస్సులో నూహించుకొని "ఇది
సత్యము, ఇట్లు చేసిన నసత్యము"
అని వ్రాసి పెట్టుకొనుడు. దినము
కొకటి చొప్పున నేఁడాదికి ము
న్నూట యఱువది సత్యవిషయము
లు వ్రాయ వచ్చును. లోకమును
జూచి వేయియసత్య విషయములు
వ్రాయ వచ్చును. దీనివలన ఫలమే

ము? అనియడుఁగుడు. దేనిని మన
మాచరించిన సౌఖ్యము కలుగునో
దేనిని జేసినఁ గష్టదశ వచ్చునో
యెఱుకపడును. పెద్దపెద్ద సంగతు
లు మీతో నిప్పుడు నేను జెప్పఁదలఁ
చుకొనలేదు. ఏమి చెప్పఁదలఁచు
కొంటిని? మీరు సత్యము బల్కిన
వారిలో హరిశ్చంద్రుఁడను రాజు
నొకనిని బాగుగా వినియున్నారు
"ఇతఁడు మగవాఁడు కావునఁ జె
ల్లించుకొన్నాఁడని" మీరు తలఁప
వచ్చును. ఆఁడుదికూఁడ సత్యవా

---

బట్టిన మట్టి చెట్టు ఫాపద్రక షుంతము

క్ష్యమువలన మేలుచెందినదనియొక
కథ జెప్పుచున్నాఁడను. సత్యము
నకు మగవాఁడేమి యాఁడుది యే
మి? మనము మగవారము కామా
మనమేల చెల్లించుకొనరాదు.?
న్యాయస్థానములకెక్కి బోనులో
"నేను దేవునియెదుట నిజము జెప్పె
దను, అంతయు నిజము జెప్పెదను.
అబద్ధము చెప్పను" అని ప్రమాణ
ము చేసి తప్పుసాక్ష్యములియ్యనేల?
ఎట్లలవాటు చేసికొనిన నట్లలవా
టగును. సాధకమున బనులు సమ

---

బాలించుచున్న రాజును, వానిరథములను

కూరు ధరలోన విశ్వదాభిరామ
వినురవేమ.

పూర్వకాలమునదశరథునకును
లేనయొకరాజునకు జాలదినములు
కొడుకు, కొమ్మలు లేకపోయిరి ద
శరథుడు రాముని తండ్రి పూర్వ
కాలమనగాజరిగిపోయినకాలము
కొన్నిపదములు మనకు వానియర్థ
ములు తెలిసినట్లు యుండును. వి
చారింపబోయితిమా తడబడు
చుందుము అసంగతమీరు మన
స్సులో నుంచుకొనుడు "తిట్టినా
గుఱ్ఱములదండును, ఏనుగులగుంపును,

నా తిమ్మిరాజాం" యామము
తిట్టుట యను నా రెండుగుదుచు
తిమ్మిరి యనునది. అదియొక
యుక్తపదమని-అల్లుకాడు. తి
మ్మిరి = వించుట. అల్లే కొడుకు
కొమ్మయనుపదములు. కొమ్మ+
చెట్టుయొక్క శాఖ. కొమ్మ+ఆఁ
డుది, భార్య. స్త్రీసంతానము.
కూఁతురు. అనుష్ఠించుచు. దశ
రథమహారాజువలెనె పుత్త్రకామే
ష్టి చేసెను. పుత్త్రులను గోరి చేసిన
యజ్ఞము పుత్త్రకామేష్టియనఁబడు

---

సేనానాయకులను వేలకొలఁది సేనను

ను. వెనుక నిష్ట్రియజ్ఞములవలన ద
శరథునకు నలుగురు కొడుకులు గ
లిగిరి. ద్రుపదరాజునకుఁ గొడుకొ
క్కఁడుఁ గూఁతురొక్కతెయుఁ గ
లిగిరి. దశరథుని యజ్ఞములోఁ
గొడుకులు నిప్పుల గుండములోఁ
నుండి రాలేదు. ఒకపాయసపాత్రి
మువచ్చినది. దానిని భుజించిన కౌ
సల్య, కైక, సుమిత్రలు రామ ల
క్ష్మణ భరతశత్రుఘ్నులను గనిరి.
ద్రుపదరాజుచేసిన హోమగుండము
లో నుండియే ధృష్ట ద్యుమ్నుఁడు

---

దన నీడ నిచ్చి యాదరించును.

ద్రౌపదియుఁ బుట్టెను. ద్రౌపదిని గు
ఱించి మీకుఁ జెప్పియుంటిమి. ఎప్పు
డు? వీరస్త్రీల చరిత్రము వ్రాసి
నప్పుడు. ఈరీతినే పయి రాజునకు-
నై రాజనఁగా, మీకు జ్ఞాపకము
న్నదా; కొడుకు కొమ్మలు లేకపో
యినవాఁడు ఈ పాట్లల మగధరా
జని వానిని పిలుచుచుందుము.
మగధరాజునకుఁ గొడుకు, కూఁతు
రు కలిగిరి. నారిచరిత్రమును మని
ము చెప్పుకొందము. ఆమెకు మద
నరేఖ యని పేరు పెట్టిరి. అన్నయుఁ

---

భూమియు నాకాశమును చుక్కలును

జెల్లెలు నొక బ్రాహ్మణునియొద్దఁ జదువుచుండిరి. కావలసినవిద్యల న్నియును నేర్చికొనిరి. వాదనరేఖ పెంష్టిఁ యీడువచ్చినఆకును గురువునొద్ద విద్యనేర్చుకొనుచుండెను. విద్యయన తరగతి పుస్తకము, వాచకపాఠములుఁ గావు. కావ్యాలంకారాదులు, పురాణములు మొదలయినవి వానిని జదువుటవలనఁ బ్రపంచజ్ఞానము కలుగును. అవునకుఁగొమ్ములెన్ని? గుఱ్ఱమునుఁ గాళ్ళెన్ని? ఇదియెవ్వరికి దెలియంది?

---

గుణాలయించను వ్యాపించిన కటికి

అందఱునెఱుఁగుదురు. కావ్యాలం
కారాదిగ్రంథములనుగుఱించి మీ
కుముందు జెప్పెదము. మదనరేఖ
యొక్క కావ్యాలంకారాది పఠన
మువలనఁ గలిగిన జ్ఞానమును జె
ప్పుటకు ముందుగా నిప్పుడు బహు
లలోఁ జదువుకొనిన యొక కన్య
క విద్యాభివృద్ధిని గుఱించిన సత్య
వృత్తాంతమును వినుండు.

ఒకయూరిలో (ఈయూరుమా
కుఁదెలిసినది మే) నొక బ్రాహ్మణ
కన్యగలదు. ఆమెయ తవారింటికి

---

చీఁకటి లోకమునకు సంతోషము గలు

వెళ్ళినపిమ్మట, పుట్టినింటివారియూ
రినుండి యొకబ్రాహ్మణుఁడామె
యున్నయూరు వెళ్ళెను. ఆమెనీలా
టిరేవునఁగనఁబడి అన్నయ్యా! యె
పుడువచ్చితివి. మాయమ్మ, నాయ
న బాగుగానున్నారా? యని ప్ర
శ్నించెను. అందఱును క్షేమము గా
నే యున్నారు. మొన్న సోమవార
మునాఁడూరంతయుఁ బరశురామ
ప్రీతియైనది. మీయింటికిఁ గూడ
నేను నాఁడుపోయికొంత సేపుంటిని
అని చెప్పినాకంగడిగోఁబసిగలిగి వ
గఁజెందఁజాలదు. ఆకసమున నొకచో

చ్చితిని. సాయంకాలము మాయిం
టికిపచ్చెదను. బావగారు గ్రామ
ములోనున్నారా” యని బ్రాహ్మ
ణుఁడు పలుకరించెను. ఎవరిపని
మీఁదవారు పోయిరి. మార్గము
లో నొకచోట నీ బ్రాహ్మణున కా
కన్యక పెనిమిటిగా కనఁబడి వాని
తో మాటలాడెను. మా యూరు
వచ్చి మాయింటికిరాకుండ నెక్క
డనో బసచేయుట న్యాయమా, మే
ము మీయూరికివచ్చి యెవ్వరింటి
కి వెళ్ళెదము” అని బతిమాలెను

చిన్నదిగానున్న చంద్రబింబము తనవె

ఇద్దఱును సంభాషణలో సమాధా
నపడిరి తప్పక సాయంకాలము వ
చ్చెదనని బ్రాహ్మణుఁడొప్పించెను.
మేము పసులమైనను మీచెల్లెలిని
జూచుటకైనను దప్పక రావలయు
నని బ్రాహ్మణుని, కన్యకమగఁడు
కోరెను. మీరెప్పుడైనను మాబి
డ్డనిచ్చుకొన్నపిమ్మట మా వారే-
బావగారూ! నేను గ్రొత్తవాఁడనా
నన్నింత బలవంతపెట్టవలయునా ?
యని బ్రాహ్మణుఁడు సరిదిచెప్పె
ను. మగఁడింటికి వచ్చినవెంటనే

---

లుగును, అంతటను నిండఁబలేకున్నను

యాకన్యకును మగనికిని జరిగినసం
భాషణము.

కన్య—(ఎదురుగా నవ్వుమొగముతో వెళ్ళి) మాయూరినుండి రామయ్యన్నయ్య వచ్చినాఁడు.

మగఁడు— మీయూరేది? ఏయూరునుండి వచ్చినాఁడు.

కన్య—(నవ్వుచు) అలవాటు-పుట్టింటివారియూరునుండి.

మగ—నాకును దారిలోఁగనఁబడినాఁడు.

కన్య—మాయమ్మా వాండ్రు బా

గానున్నారని చెప్పినాఁడు.

మగ — నాతోఁగూడనట్లే చెప్పినాఁడు మీవాండ్రయిండ్లుకాలిపోయినవని చెప్పినాఁడు.

కన్య — (ఏడ్చుచు) అయ్యో నాతోఁజెప్పలేదేమి. నేనేడ్చెదనని గాఁబోలును.

మగ — వీతోఁజెప్పినాఁడంటగదా?

కన్య — ఏమిచెప్పినాఁడు ఏమిటో పరశురామ ప్రీతియన్నాఁడు. నేనేమోసంతర్పణయనుకొంటిని

మగ — కాదుకాదు ఇండ్లుకాలినవి.

దీపము చిన్నదియైనను ఉపయోగమే

(చూచితిరా పరశురామప్రీతికి పదార్థమెట్లున్నను ప్రపంచజ్ఞానము లేనిదే యెన్నిచదువులు చదివిన నర్థము తెలియ లేదు.)

అన్న తండ్రితో రాజ్యమేలుట లో సహాయుండై వ్యవహారములో నున్నాడు. మదనరేఖ గురువుగారియింటం జదువుకొను చున్నది, అమెయిట్టిదని యట్టిదని ముక్కు, మొగమును వర్ణించుట లాభము లేనిపని. గుణమును వర్ణించుట మంచిది. ఇపుడు మనకుం గధల

లోనే తెలియవచ్చును గనుక దా
నికై కొన్నిబంతులు వ్యయము చే
యనక్కఱలేదు. తోడివారందఱు
ను జతపుకొని యొకనాఁడు చదు
వులగదిలోనుండి చదరలు పుస్తక
ములుఁబట్టుకొని తుట్టుమనిపరుగె
త్తిరి. మదనలేఖమాత్రము పుస్త
కములు చక్కఁబెట్టుకొనుచు వ్యా
సపీఠమును మడతపెట్టి గూటిలోఁ
బెట్టునఁ గొంచెము వెనుకఁబడి
యెను గురువుగారి కుమారుఁడు
పదునేనిమిది యేండ్ల వాఁడొంటి

[జమా· తయుఁడను. గొప్పపర్వతములు

పాటునవచ్చికొంగుపట్టుకొని యా
మెను జూచుచుండెను. ఏమిచేయఁ
గలదు. గట్టిగానఱచునా గురుకు
మారుని బదిమంది నిందింతురు.
ఒంటిగానున్నది గురుకుమారుఁడే
మిచేయునో రెండుచిక్కులామెకు
వచ్చినవి. ముల్లుగంపమీఁది వస్త్ర
ముందీసినట్లుబట్టచిరుగకుండ ము
ల్లుగుచ్చుకొనకుండఁ గార్యసాధ
కము చేయనెంచినది. నీవునాగురు
వుగారి కొడుకవు. నాతండ్రిరాజు
నేను గన్యకను నాతండ్రియిది విని

---

కూడ పిడియైపోవునను సంగతినెఱిం

యెనా నీతండ్రికిఁ బరువుచెడునట్లు నిందించును. మీయందఅవృత్తికి భంగమువచ్చును. ఒకవేళ మిమ్ము మాదేశములో నుండవలదనునే మో వృత్తి=చేయుపని (చదువులుచెప్పిజీవించుట) నన్నుశిక్షించును. అట్లుజరగెనా నన్నెవ్వరుపెండ్లిచేసికొందురు. దానివలన మా తండ్రికిఁదలవంపులు నీవంటివాఁడు నన్నిట్లు పట్టుకొనుట న్యాయమా పెండ్లి కానికన్యకను మగవారు అంటకూడదు. పెండ్లికాకుండ నేనింగవా! ఆగకుశమునకు పినుఁగు జడి

దుకొండంబడితినా నలఁగిపోయినపు
వ్వులదండ నెవ్వరు ధరింతురు. న
న్నుఁజూచువారెవ్వరు ? నీకీకష్టపు
వేళ నిట్టిదుర్బుద్ధి యేలపుట్టినది? ఇ
ది యెట్లుమాఱునో నన్నువిడిచిదూ
రముగనుండుమని నెమ్మదిగఁబలికె
ను. బ్రాహ్మణబాలుఁడు నీమాట
లుకట్టిపెట్టుము. చేతికివచ్చినపండు
ను జాఱవిడుచువెఱ్ఱివాఁడను గాను
అనిపైటకొంగువిడువలేదు. పిమ్మ
ట నాకు భోజనమునకాలస్యమగు
చున్నది. మరల బడికిరావలయును

యునట్లు గుణవంతునకు దుర్గుణములుగ

నీవిట్టివాఁడవని మావారలతోఁ జె
ప్పి నీకావరముదించెదను జూడు
మని కొంచెము కఠినముగ మదన
రేఖ బెదిరించె కొంగువిడిపించుకొ
నిన గురుకుమారుఁడొడలు తెలియ
క క్రిందఁబడి మూర్ఛిల్లెను. ఆ బాలి
కకు వానిని విడిచిపోవ మనస్సొప్ప
లేదు. ఏలయిట్లయ్యెనని ముక్కుక
డ వ్రేలిడి గుండెపైఁ జేయిడి చూచె
ను. ఊపిరికనఁబడదు, గుండెకొ
ట్టుకొనుట లేదు. అన్నా! గురువు
వచ్చి చూచెనా నన్నేమనితలంచు

---

లవాఁడెంత గొప్పవాఁడయిన నాశ్రయవ

నోగదా ! ఈ బాలుని నేజంపినట్లగు
నా ! ఏమి చేయవలయును. ఈతని
కోర్కెకి సమ్మతించితినా కులము
లో వన్నెతక్కు వయగునని భయ
పడితిని. ఈతనిమరణముచే నాకుఁ
బాపము చుట్టుకొన్నదఁ. అని "తో
డమీఁదఁజఱచి గుండెపైఁదట్టి పే
రుపెట్టి యినుమారు మున్మారు
పిలిచినది. ఈప్రక్క నుండి యాప్రక్కకొ త్రిగిలినాఁడు. కొంతమూర్ఛ
మునిగి మదనరేఖ గురుపుత్త్రి !
ఇంతకను వెత్తి యుండునా ! ఏదినా

---

డవలసినదియే కదా. కొద్ది జీతములో

వంకఁజూడుము. నీవు నన్ను నవ్వు
లాట కింటివి గాఁబోలు గ్రహింపం
ప లేక నిన్ను నేను గసరితిని నే
నునీకుఁ దెలియనిదానను గాను నీ
కోర్కెఁ దీర్చుటకు నాకొకవరమిమ్మ
నికోరెను. ఆవిప్రతనయుఁడు తన
మాటకు సమ్మతించునని యెంచి
యేమి యావరమనియెను. "ధన
ధాన్యములు కావు, నేను పెండ్లియా
డినపిమ్మట నాపతిని జేరుటకుముం
దు నీకోర్కెఁ దీర్చెదను. అంతవఱకు
నీవు నాకు సెలవిమ్ము" అనిన యా

---

పన్నబడిపంతులను గాంచిన లక్ష్మాధికా

రాజపుత్త్రికతో " నేనెన్నఁడన
బ్లాడఁబడను. తేనెపట్టును లేఁపి
తేనెఁగొనకుండువాఁడు మూఢుం
డు నేను నిన్నన్నిదినములు విడువ
ను. ఇది నీవు నన్నువిడిచిపోవుటకు
బన్నినయుపాయము. ఇప్పుడు వ
లనుపడినది పెండ్లియైన పిమ్మట నీ
మగఁడు నిన్నుఁ గదలనిచ్చునా ని
న్ను నమ్మువారెవ్వరు? ఎవ్వరు
పూఁటపడెదరు. అనిబాహ్వాకు
మారుఁడు సమ్మతింపకుండెను. నే
నుమదనరేఖను పల్కిబొంకుటకు

---

రిదైనఁ దనబిడ్డ విషయమయి గౌరవ

నా కేమిచ్చి మెత్తినదా ! అనియా
యువతిపలికెను. పలికినట్లు చేయు
ట యేమి మీఁద మీఁద నున్నదా!
అది యెంతటివారికి ! " ఆఁడువారి
మాటలు నడగంష్ఠమూటవలెనిలు
వదు. నావంటివాని కోరిక జూద
ప్రసాదమ్మువంటిది. తలఁచినప్పుడా
రీతిని జరగవలయును దీనికి నిలు
కడలేదు నీపీనాఁడుతప్పించి వే
ఱొకనాఁడు వస్తువను నమ్మకము
లేదు." అని నమ్మకున్న గురుకు
మారునకు " నేను మరలరాకుం

---

ము సేయుటచే గాఁ అధనికుని పిల్లవాం

టినా మంచివయసువానికిఁ దగిన
కన్యను బెండ్లిచేయఁబోవు వారియు
త్సాహమునకడ్డువచ్చిన కష్టాత్ములుపో
వు నరకమునకుఁబోదు" నని యొ
ట్టుపెట్టుకొని వాని సెలవుగొని మా
దనరేఖ యింటికిఁజనినది.

మాటనిలుకడ యినట్లుండవల
యును. పెండ్లియగువఱకు స్వామగు
వశో నొక్క ప్రసంగమైన బ్రాహ్మణ
తనయుఁడు కాపింపలేదు. ఈతనికి
వేఱుతలంపులుడిగి సత్యాసత్యము
లు నిర్ణయింపమనస్సు వుట్టెను. ఈ

---

డు౹ను ఆనొజ్జను జూచిన గడ గడ

రా చకన్నె యనినమాట నిలువఁబె
ట్టుకొనునా యసత్యమాడి కీర్తిచె
అచుకొనునా యను దృష్టి గోనికి
దిగినాఁడు. కొన్నిదినములకుమదన
రేఖకుఁ బెండ్లియైనది. ఒకనాఁడు
గృహప్రవేశోత్సవము చేయనెంచి
రి. చక్కఁగా సాయంకాలమున
నామె కలంకరించిరి. దాసీజనము
మేడమీఁద స్వర్గతుల్యమైయున్న
పడకగదియొద్దకుఁ గొనిపోవుచుండి
రి. అప్పుడామెతనలో "ఆహా! ఎం
తొట్టి చిక్కు తటస్థించినదిఁ గురుపు

---

త్రాచుంట గుణాగుణ భేదము ంబట్టి

తునితో పెనిమిటిని జేరుటకుము
న్న నీకోర్కె తీర్చెదనంటిని. ఇదు
గో పెనిమిటియున్నగదిలోఁ బ్రవే
శపెట్టుచున్నారు. నేనసత్యమాడిన
దాననై పాతకము నొందుటనిశ్చ
యము. పాతకము = పాపము. గది
లోనికిఁజొరకుండ నీదాసీజనమున
కెఱిఁగించి బ్రాహ్మణుని యింటికి
వెళ్ళి వచ్చెదననిన వీండ్రు విడతు
రా! పతితోఁ జెప్పిపోవుదమనిన నా
తఁడు క్రొత్తవాఁడు నాహృదయ
మతనికింకను బటుపడలేదు. ఏమని
యేకాని ధనమును బట్టిగాని దనహీనత

రాచకన్నె యనినమాట నిలువఁబె
ట్టుకొనునా యసత్యమాడి కీర్తిచె
ఱచుకొనునా యను దృష్టిఁ గోనికి
దిగినాఁడు. కొన్ని దినములకు మదన
రేఖకుఁ బెండ్లియైనది. ఒకనాఁడు
గృహప్రవేశోత్సవము చేయనెంచి
రి. చక్కఁగా సాయంకాలమున
నామె కలంకరించిరి. దాసీజనము
మేడమీఁద స్వర్గతుల్యమైయున్న
పడకగదియొద్దకిఁ గొనిపోవుచుండి
రి. అప్పుడామె తనలో "ఆహా! ఎం
తటిచిక్కు తటస్థించినదిఁ గురువు

---

లాంఛనములు చూపుట గుణాగుణ భేదము లెంచట్టి

తుని తో పెనిమిటిని జేరుటకుము
న్న నీకోర్కె తీర్చెదనంటిని. ఇదు
గో పెనిమిటియున్నగదిలోఁ బ్రవే
శపెట్టుచున్నాను. నేనసత్యమాడిన
దానవై పాతకము నొందుటనిశ్చ
యము. పాతకము=పాపము. గది
లోనికిఁజొరకుండ నీదాసీజనమున
కాజ్ఞాపించి బ్రాహ్మణుని యింటికి
వెళ్ళి వచ్చెదనని వీందుని విడతు
రా! పలితోఁ జెప్పిపోవుదమనిన నా
తఁడు కొ త్తవాఁడు నాహృదయ
మతనికింకను బట్టుపడలేదు. ఏమని

తలంచునో యిన్నిటికిని దీనికుపా
యమేమని యొకరితోఁ జెప్పదగి
నపని కాదు ఓ ధర్మదేవతా! నన్ను
రక్షింపుము. వాఁడెంత! బ్రాహ్మ
ణబాలుఁడేమి చేయునని తోఁసి వి
డిచి మాట తప్పరాదుగదా! అని
యెంతయుఁ దలపోసి యేదియేమై
నను పెనిమిటి సేవ పొందుటకం
టె వేఱుమార్గము దీనికి లేదని ప
డుకటింటిలోనికిఁ బోయెను. అప్ప
టి యామె పరితాపము చెప్పనల
విగానిది. చెప్పుదునా మానుదు

---

ను బట్టిగాని కాదు. ఒక్కొక్క సమయ

నా యని విచారించి విచారించి
యితనికిం జెప్పక తీరనదికాదు.
పరులతోం జెప్పిన తీరనది కాదని
యాతనియొద్దం జేరినది ఆసమయ
మెట్టిదో యోజించుచు. క్రొత్త
పెండ్లికూతురు పరస్థలమునుండి వ
చ్చిన క్రొత్తమగడు చెప్పవలసిన
మాటయెంతటిదో యప్పటిసిగ్గెం
తటిదో యాలోచించుచు సాహ
సించి సిగ్గొకమూలకుం బోయినిలు
చునట్లు సాష్టాంగముగా నేలబడి
మ్రొక్కినది.

---

క. కరయుగములు జానువులు
నురము లలాటస్థలంబు నున్నతభుజ
ములు
ధరధరణి మోపి మ్రొక్కెడు
నరువడి సాష్టాంగ మండ్రు వరమును
నీందుల్.

ఈపద్యము సాష్టాంగముచేయు రీతిచెప్పుచున్నది. మనము వరుసవడి చెప్పుకొనుటకే యిది పుట్టినట్లెంచుచున్నారము.

పెనిమిటి—(లేవనెత్తి) ప్రాణేశ్వరీ! నన్ను నీవింకను దెలిసికొనలేదు. నన్ను పరినోవలె భావించుచున్నట్లున్నది

---

పొలంగవలసినవాఁడగును. పెద్ద పిన్న

లెమ్ము లెమ్ము నేనునీవాఁడను నీవే
దో చెప్పఁదలఁచినట్లున్నది చెప్పుము

• భార్య — క్షమింపవలయును క
న్యాత్వమున గురునియొద్దఁ జదువు
చుగుఁ పుత్ప్రనిమిష్టరా త్రినుండి త
ప్పించుకొనుటకై వివాహమైనప
దంపడి పెనిమిటిం జేరుటకంటె ము
న్న నీకోర్కి తీర్తునంటిని కన్యాత్వ
ధర్మములను బాడుచేసికొనుట పా
పముగాని పెనిమిటిసెలవుపైఁ జేసి
నదాన దోషమురాదు. నేను పల్లి
బొంకనిదాననె నన్యోఁ బాపంబు

ల తారతమ్యము లేక బుద్దినిబట్టి జరు

చుట్టుకొనును. పాపాత్మురాలైన భార్యం బెట్టుకొన్న పురుషుఁడు మఱింత పాపియగును. నన్నేమిచేయుమన్న నట్లు చేసెదను.

పతి—(యట్లు యాలోచించి) "ఎంత సాహసకార్యము! ఆఁడువారెంత బిఱ్ఱలైనఁ జేయుదురు. ఎఱిఁగియుండి నాభార్యను బయటి యొదికిఁ బంపుటొల్ల పంపకున్న నసత్యదోషము సిద్ధించును.

భార్య—సత్యవాక్యమట్టుండనిమ్ము ఆఁడువారిమాయలు మగవా

---

గునని యగుటంజేసి చిన్నవాఁడైన

ను కనిపెట్టలేరు. చేయవలయు న
నిన నెంతకయినఁ జాలుదును. నే
నట్టిదాసను గాను. నీయొద్ద దాపరి
కమేల. పోయిరమ్మన్నఁ బోయి వ
చ్చెదను. మానుమనిన మాను దు
ను గాని నామూలమున నీకుఁ బాప
ము చుట్టుకొనుటకు నేను సహింప
క యింతటిరహస్యమును దెల్పితిని.

పెనిమిటి— నేను బాప మన్న
భయపడు వాఁడను. సత్యముతప్పు
టయన్న మరణము నొందుటయే.
కావునఁ బోయితమ్ము.

ను గుమారుఁడు చెప్పినట్టే నడువవలసి

మదనరేఖ యత్యంతసంతోష మునొంది మగనికి మ్రొక్కి యిలు వెడలి చల్లగ నొంటిగ రాజమార్గ మునఁ బడి బ్రాహ్మణ గృహమున కుఁ బోవుచుండెను. చీఁకటి, చిను కులుపడుచున్నవి. మసిబొగ్గులరా శివలెనున్న యారాత్రివేళసంతకం టెఁ గాఢ నలుపు పైకి చట్టునఁ గంటికిఁ గనఁబడు దేహముతో నొ క రాక్షసుఁ డెదురుపడి "ఎవ్వరు? వయసులోనున్న యాఁడుది. దొం గతనముగా నింటివారిని మాయ

---

వచ్చుచున్నది. అందువలన నేనీతిశాస్త్ర

చేసి యెందో పోవుచున్నట్లున్నది.
నిలునిలు " మని యదలించెను.

మదనరేఖ—నేను రాజపుత్రి
ని. గురుపుత్రుని కోర్కెదీర్పఁబో
వుచున్న దానను.

రాక్ష—ఛీ! ఏటిమాట. అట్టి
నీతండ్రి, అట్టి నీ కొ్రత్తమగఁడు,
ఇట్టిపనికి నిన్నుబంపుచున్నారా ?

మద— అసత్య దోషమునకు
భయపడి—

రాక్ష—మనుష్యులెట్టి నీచ
పుఁబనులు చేయుటకయిన నొడఁ

మదనరేఖ యత్యంతసంతోష
మునొంది మగనికి మ్రొక్కి యిలు
వెడలి చల్లగ నొంటిగ రాజమార్గ
మునఁ బడి బ్రాహ్మణ గృహమున
కుఁ బోవుచుండెను. చీఁకటి, చిను
కులుపడుచున్నవి. మసిబొగ్గులరా
శివలెనున్న యారాత్రివేళనంతకం
టెఁ గాఱు నలుపు పైకి చట్టునఁ
గంటికిఁ గనఁబడు దేహముతో నొ
క రాక్షసుఁ డెదురుపడి "ఎవ్వరు?
వయసులోనున్న యాఁడుది. దొం
గతనముగా నింటివారిని మాయ

---

వచ్చుచున్నది. అందువలన నేనీతిశాస్త్ర

చేసి యెందో పోవుచున్నట్లున్నది.
నిలునిలు " మని యదలించెను.

మదనరేఖ—నేను రాజపుత్రి
ని. గురుపుత్రుని కోర్కెదీర్పం బో
వుచున్నదానను.

రాక్ష—ఛీ! ఏటిమాట. అట్టి
నీతండ్రి, అట్టి నీ కోరిత్తమగండు,.
ఇట్టిపనికి నిన్నుబంపుచున్నారా ?

మద— అసత్య దోషమునకు
భయపడి—

రాక్ష—మనుష్యుం లెట్టి నీచ
పుంబనులు చేయుటకయిన నొడం

మునసంపూర్ణ ప్రజ్ఞగల బుద్ధిమంతులు

బడుచున్నారు నా కాంకలిగా ను
న్నది నిన్ను దినినిమ్మ.

మద — ఆడినమాట తప్పిన పా
పాత్ముర్రాలి నెట్లుభుజింతువు. కా
నికూడుదిందువా ? రెండుగడియ
లుతాళుము. తిరిగివచ్చెదను.

రాక్ష — ఆడిన మాట తప్పని
వాండు, ప్రచ్చుకొన్నయప్పు సరి
గాందీర్చినవారు మనుష్యులలో ను
న్నారా ? నిన్నువిడువను.

మద — ఉండకేమి — రెండుగ
డియలు తాళంజాలవా ?

---

పిల్ల వాండ్ర నోటినుండివచ్చినది మైన

రాజు—ఉన్నను సముద్రము లోని రత్నములవలెఁ గనఁబడరు. ఆఁకలిగొన్నవాఁడు రెండు గడియలుగాదు, రెండు నిముసములు నిలువలేఁడు. నిన్ను విడిచిన మరల రావు

మద—ఈ యాకాశము భూమిసాక్షిగా రెండుగడియలలో వత్తును.

రాజు—నీవు రాకుంటివా గాఢనిద్రలో నున్నవానినిబొడిచిచంపినవాని పాపమునఁ బోదువు చు

మా. ఆడిబొంకుట నీకుఁ దగదు.

మద — అట్లే కానిమ్ము

అని యక్కడనుండి మెల్ల మెల్ల
గ గురుగృహమునకుఁబోయియొం
టిగాఁ బండుకొనియున్న సమయ
మున గురుపుత్త్రుని లేపి నాఁడు నీవ
రముచూర్పనఁబోయి పెండ్లి యా
డి మాటనిల్పుకొనుటకయి వచ్చిన
దాననని పల్కెను ఆబాలుఁడు అ
ద్దిరా! ఆఁడుదానవనియనీవే! రా
జపుత్త్రివి! వయసుదానవు! నా
తండ్రిశిష్యురాలవు! శివశివ! అ

---

యునని చకచకఁగా నుడివియున్నారు.

యినయింటిబిడ్డవు ! నీకునన్నిట్లను
గఁజెల్లునా ! యనియెను.

• మద—అబ్బ ! యెంతటినంగ నాచివైతివి. అల్లనాఁడు నా మానభంగము చేయఁ దలఁచి నీప్రాణముం బోఁగొట్టుకొనఁ దలఁచియుం తలో వైరాగ్యమునొందితివా !. ఎఱుఁగనివారియొద్దఁ జెప్పుము నీ పరితాపములు.

బాలుఁడు—రాజకుమారికవు నీవేమిచెప్పినను జెల్లును. నీకెదురుత్తరము నేనీయఁజాలను. ఇట్టిపను

---

కాఁబట్టి నీతికోవిదుః మాటలు వ్యర్థము

లోనర్చిన మమ్ము గురుపదముగఁ
జూచుకొను రాజులు, సూరి పెద
లు నాదరింతురా !

మద— ఓరి మునిముచ్చా!
ఇంతటివాఁడవు నన్నప్పుడంత చే
సితివేల ? కుక్క వేషము వేసినప్పు
డు మొఱుఁగక తప్పదు సిగ్గువిడ
చి యింతకువచ్చి యూరక పోవుట
నాకుఁదగదు. మాట తప్పరాదని
వచ్చితిని. నీవునన్ను పేక్ష చేయరా
దు. సన్న్యాసివైతివా ? వైరా
గ్యము ముదిరినదా ? నాపెనివిటి

కి వెఱచుచున్నావా? నా పినిమి
టినోఁ జెప్పియేవచ్చితిని. నేనుమ
రలిఁబోవలయు నాలస్యము కారా
దు.

బాలు—రాజపుత్రి! నీవు నా
చెల్లెలువంటిదానవు. కన్నుగానక
నాఁడు తప్పు చేసితిని. ఆడినమాట
తప్పక నీవువచ్చితివి. ఆనాఁటి పని
మహాపాతకం బని తెలిసికొంటిని.
ఆనేరనిపని కయి వచ్చిన పాపము
పోఁగొట్టుకొనుటెట్లు నాకుఁ దల
మున్కలైయున్నది. నన్ను క్షమిం

మంచి మాటలు నేర్చుకొని సుగుణము

చి నీపతికడకుఁబొమ్ము నీ సత్యవా
క్యపారీణత జగమునఁ గ్రమముగ
వెల్లడియగును.

అనిపలికిన మదనరేఖ తిరిగి వ
చ్చుచుండ రాక్షసుండు "ఏమి!
చెక్కు చెదరక వచ్చుచున్నయది.
వెళ్ళినట్లె మరలి వచ్చుటకుఁ గార
ణమే" మని యడిగెను. "నాయ
దృష్టవశమున నాతని చిత్తము ధ
ర్మమార్గాయత్తమయినది ఇఁక
నాలస్యమేల నీ యాఁకలిఁ దీర్చు
కొను" మని యామె రాక్షసుం

గోరెను. చూడుఁడు. బ్రాహ్మణు
నియింటికిఁ బోవ సెలవడిగినది. న
డుమ రాక్షసుఁ డొక్కఁ డడ్డినాఁ
డు పెనిమిటి యెదురు చూచుచు
న్నపుడు రాక్షసున కాహారమగు
టతటస్థించినది చిక్కులోఁ జిక్కె.

ఆ రాక్షసుఁడు ముక్కున వేళ్ళు
లు వెట్టికొని "ఈస్త్రీ యెంతటి స
త్యవతి నియమముగలది! దీనిని
మ్రింగి యేగతికిఁ బోదునో. ఎన్ని
జీవులనో చంపి పొట్టఁ బెట్టికొంటిని.
ఇఁకఁ బ్రపంచములో ననత్య వా

దులంబట్టి మ్రింగెదను " అని యెం
చి పశ్చాత్తప్తుఁడయి (ముందుచె
డ్డపనిచేసి పిమ్మట నొచ్చుకొనుట
పశ్చాత్తాపము) తల్లీ! నన్ను దు
ర్గతి బొందకుండఁ గాపాడుమని
ప్రార్థించెను. "అన్నన్నా! నీ
కాఁకలిగానున్నది. చాలరాత్రియ
గుచున్నది. నీవు నీరసపడియున్న
వాఁడవు. నన్నుభుజియింపుము"
అని మదనరేఖ బతిమాలెను.
"వలదు వలదు. నీసత్యవాక్యము
ను, నీపెనిమిటి గొప్పఁదనమును,

---

* ప్రాణము. † సుగుణ * మానము.

బ్రాహ్మణకుమారుని వైరాగ్యము
ను సంతోషమానసునిఁ జేసినవి.
కడుపునిండినది. నీవు నాకిప్పుడు
జ్ఞానమార్గ ముపదేశింపు మని
దానవుఁడు కోరెను. "నీయాఁక
లిమాటలతోఁ దీరదు. నన్నుమిం
గి యెవ్వ రయిన మహాత్ములయొ
ద్ద జ్ఞానవాక్యములవినుము. శరీర
ము నిల్పుకొమ్ము." అని మదన
రేఖ యెంత చెప్పినను రక్కసుండు
వినలేదు. మదనరేఖ వానికి బొం
కవలదని, హరిభక్తియుతుఁడ వ

గుము. హరిభక్తి లేని మనుష్యు
లే రాక్షసులుగాని మీరు రాక్షసు
లు కాఁజాలరు. అని చెప్పి పెనిమి
టిపాలికిఁజని జరిగినవృత్తాంతంబా
తయుఁ జెప్పినవిని తనకిట్టికన్య భా
ర్యయగుట యొక గొప్పభాగ్యము
గానెంచి యామదనరేఖ నతిప్రే
మంగారవించుచు సుఖంబుననుం
డెను. రాక్షసుఁడు విరాగియై య
డవిలో నిరాహారియై విష్ణుభక్తి
చే మోక్షము నొందెను కొన్ని
నాళ్ళకు శ్రీహరి యీదంపతులకు

---

సుగుణమే ధనము. సుగుణమే ప్రా

యీ గరుణించి కలలోవచ్చి మీ
కేమి కావలయునో కోరుకొండని
యడిగెను. ఇంతకంటె వేఱుకోరి
కమాకు లేదు. మా మనస్సు లెల్ల
ప్పుడును సత్యమునందు నిలుచు
నట్లును గడపట నీ పాదపద్మసేవ
దొరకునట్లును గరుణింపుమని వేఁ
డికొనిరి. ఇచ్చితినని పరమేశ్వరుఁ
డదృశ్యుఁ డయ్యెను. సత్యవాక్య
ము మదనరేఖ మానప్రాణములఁ
గాపాడినది. సత్యవాక్యము నందలి
గౌరవము బ్రాహ్మణకుమారుని న

---

ణమిత్రము. సుగుణమే చుట్టము. సు

స్వర్గమునకు దింపినది. రాత్రి సునికి వైకుంఠము లభింపఁ జేసిన ది. ప్రపంచమంతయు సత్యము వలననే నిలిచియున్నది. భారతములో నొకచోట, సూర్యోదయాధారమున నాకసమున వ్రేలాడుచున్నాఁడను ప్రశ్నకు "సత్యాధారమంద్రుడు బుధులు" అని చెప్పఁబడియున్నది.

సత్యవాక్యము

సంపూర్ణము.

---

గుణహీనరాముని కథాభాగము.

